# తొలిపలుకులు - ధన్యవాదములు

వేదాలలో అక్కడక్కడ కొన్ని ప్రాకృతిక శక్తుల గుణగణాలను ఆలంకారిక భాషలో చెప్పటం జరిగింది. వాటిని సరిగా అర్థం చేసుకోలేని పండితులు వాటికి కొన్ని కథలను అల్లి మూర్తులను నిర్మించారు. ఆ మూర్తుల పూజా విధానాలను వ్రతనియమాలను కల్పించారు. వాటికి పురాణాలని పేరుపెట్టి ప్రచారం చేసారు. అవి తాము వ్రాసినవంటే నమ్మరని మహర్షి వేదవ్యాసుల వారు వ్రాసినవని నమ్మబలికారు. పర్యవసానంగా నిరాకార ఏకేశ్వరోపాసన స్థానంలో అనేక దేవీ దేవతల మూర్తులు వెలిసాయి. వాటిలో గంగాధర శివుడు ఒక దేవత. ఆ పేరు గలిగిన వారు కూడా కొందరున్నారు.

అట్టి గంగాధర శివుని వెనుక ఏ వైజ్ఞానిక రహస్యం యిమిడి వుందో ఈ లఘు గ్రంథంలో వివరించటం జరిగింది. వేద పదములకు ఆది దైవికార్థం కూడా తెలుసుకోవటంవల్ల విజ్ఞానం వికసిస్తుంది. అభ్యుదయం సిద్ధిస్తుంది. అందుచే వర్షప్రకరణంలో (వర్ష విజ్ఞానంలో) గంగాధర శివుడు ఎవరో వివరించ ప్రయత్నించటం జరిగింది.

తూర్పుగోదావరి జిల్లా మండపేట మండలం వల్లూరు గ్రామ వాసులు శ్రీ పాలచర్ల రామకృష్ణ, శ్రీమతి సూర్యకుమారి దంపతులు సాహిత్య ప్రచురణకై మా ట్రస్టునకు రూ. 2,000/-లు విరాళంగా యిచ్చారు. వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

పరమేశ్వరుడు వారికి, వారి కుటుంబము వారికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యల నిచ్చి కాపాడును గాక.

ఈ పుస్తకాన్ని చక్కగా ముద్రించి యిచ్చిన ప్రింటుషాపు కార్యకర్తలకు యజమానులకు మా ధన్యవాదములు.

**- కోదూరి సుబ్బారావు**
గాయత్రీ ఆశ్రమ ట్రస్టు




# గంగాధర శివుడు

# ?

కర్త :

డా॥ కోడూరి సుబ్బారావు

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 39
ప్రథమ సంస్కరణము
ప్రతులు : 1000

శ్రీ పార్థివ శ్రావణ పూర్ణిమ
మూల్యము : **5-00**
(పోస్టేజి అదనము)



ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమము, 12-10-586/6, వ్యాస్ సమాజము, మేడిబావి, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61.
2. అంబా దర్శన గ్రంథమాల, ఆర్యసమాజము, కూచిపూడి, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా 522 313.
3. మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, 3-3-738, మాశెట్టి బిల్డింగ్, కంచరిబజార్, సికింద్రాబాద్ - 3.
4. వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 095.
5. కోటికె లక్ష్మయ్య, సుల్తాన్‌బజార్, ఆర్యసమాజం ఎదురుగా, హైదరాబాద్ - 95.

Printed at

**PRINTSHOP**
Ph : 040-5532 0300

ఓ3మ్

# గంగాధర శివుడు ఎవరు ?

(ఈ వ్యాసం 'టంకార సమాచార్' మార్చి 2005 విశేష సంచికలో ప్రచురింపబడిన 'శివ శంకర్‌కీ గంగా' అనే వ్యాస ఆధారంగా వ్రాయబడింది. ఆ వ్యాస రచయిత్రి సుశ్రీ ఆచార్యా సూర్యాదేవీ చతుర్వేదా (పాణినీయ మహా విద్యాలయం/వారణాసి). ఇది అనువాదం కాదు. దాని ఆధారంగా వ్రాయబడిన లఘు గ్రంథం)

పురాణాలలో వర్ణించిన శివుని గురించి ఆబాల వృద్ధపర్యంతం అంతా తెలిసినవారే. అతడు కైలాసవాసి. పార్వతీపతి. అర్థనారీశ్వరుడు. గంగాజటాజూటధారి. పినాకపాణి. త్రిశూలధారి. వల్కల వస్త్రధారి. చంద్రముకుటధారి. పశుపతి. వృషభవాహనుడు. త్రినేత్రశోభిత ముఖారవిందుడు. ఈ విధంగా శివుని గురించి పురాణాలలో వర్ణనలు కనబడతాయి. విష్ణుపాదాలనుండి వెలువడిన గంగ భూమిపై అవతరించేటప్పుడు దానిని ధరించగల ఒక శక్తిశాలి అవసరమయ్యేనట. ఆ కాలంలో అట్టి సామర్థ్యంగల శక్తిశాలి శివుడు మాత్రమేనట. దేవతలంతా ప్రార్థించగా శివుడు దివినుండి భువికి దిగివచ్చిన గంగను తన జటలలో బంధించెనట. తదుపరి భగీరథుడు కఠోరమైన తపస్సు చేసి ఆ గంగను భూమిపై ప్రవహింపజేసి సాగరమునకు చేర్చెనట. ఆ విషయాన్ని రఘువంశకావ్యం ఈ విధంగా వివరిస్తుంది.

సూర్యవంశ రాజులలో సగరుడు అనే పేరుగల గొప్పరాజు ఉండేవాడు. సుమతి అనే పేరుగల అతని ధర్మపత్నివల్ల అతనికి

60,000 మంది పుత్రులు పుట్టారు. అతడు 99 పెద్ద పెద్ద అశ్వమేధ యజ్ఞాలు జయప్రదంగా నిర్వహించి అందరి ప్రశంసలు పొందాడు. అతడు 100వ యజ్ఞం నిర్వహిస్తూ ఉండగా ఓర్వలేని దేవతల రాజైన యింద్రుడు విఘ్నం కలిగించాడు. యజ్ఞాశ్వాన్ని అపహరించి పాతాళ లోకానికి తీసుకుపోయి కపిలమహర్షి ఆశ్రమ సమీపంలో వదలిపెట్టాడు. సగరుడు ఆ యజ్ఞశ్వాన్ని వెదికే పని తన పుత్రులకు అప్పగించాడు. వారు భూలోకమంతా వెతికినా యజ్ఞాశ్వం కనబడలేదు. పాతాళంలో ఉండవచ్చు ననుకొని భూమిని త్రవ్వి పాతాళలోకానికి దారి చేసారు. ఆ విధంగా త్రవ్వటంవల్ల సముద్రం యొక్క పరిధి పెరిగి సాగరమని ప్రసిద్ధిని పొందింది. సగరపుత్రులు పాతాళంలో కపిల మహర్షి ఆశ్రమ ప్రాంతంలో యజ్ఞాశ్వాన్ని చూసారు. ఆ మహర్షియే అపహరించి ఉంటాడని అనుమానించారు. మహర్షిని అనేక దుర్భాషలాడి అవమానించారు. అందుకు ఆ మహర్షి క్రోధితుడై శాపమిడగా 60,000 మంది సగరపుత్రులు భస్మమైపోయారు.

అనంతరం రెండు మూడు తరాల తదుపరి ఆ సూర్యవంశంలో "భగరథు" డనే పేరుగల ఒక పరాక్రమశాలి ఉద్భవించాడు. అతడు తన పూర్వజులైన ఆ సగరపుత్రులకు సద్గతి కలిగించాలని కఠోరమైన తపస్సుచేసి గంగను భూమిపై ప్రవహింపజేసి పాతాళానికి చేర్చాడు. తన పూర్వజుల భస్మరాశులపై ప్రవహింపజేసాడు.

రఘువంశకావ్యంలోని పై కథ ఎంతవరకు చారిత్రాత్మకమో! ఎంతవరకు కల్పితమో ! తెలియటం కష్టం. ఇది ఏదో ఒక ఆధ్యాత్మిక విషయాన్ని తెలిపే ఆలంకారిక కథవలె ఉంది. లేకుంటే ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తాయి.

జలం జటలలో ఎలా బంధింపబడుతుంది ? జల స్వభావం పల్లమునకు ప్రవహించటం కదా? మన తలపై నీరు పోసుకున్నా అది అచ్చట నిలువదు కదా ? కనుక ఇచట వర్ణింపబడిన శివుడు శరీరధారికాడు. జటాజూటధారియును కాడు. ఇది ఏదో ఒక తత్త్వమై (పదార్థమై) ఉండాలి. అది ఏమై ఉంటుంది ? అని ప్రశ్నించుకొని లోతుగా ఆలోచిస్తే అది మేఘాలలోని మెరుపు అని అర్థమౌతుంది. పెక్కురకు ఇది క్రొత్త విషయం. విద్యుత్ (మెరుపు) శివుడు ఎట్లవుతుంది. ఆలోచింతము రండి.

వివిధ రుద్రుల వీరవిహారాలను గూర్చిన వర్ణనలు మనకు యజుర్వేదంలో 16వ అధ్యాయంలో కనబడతాయి. అందులో పై విషయాలను వ్యక్తపరచే కొన్ని వాక్యాలను పరిశీలిస్తే విషయం బోధపడుతుంది. ఈ అధ్యాయంలోని మంత్రాలకు 'రుద్రుడు' దేవత. అందుచే ఈ అధ్యాయానికి 'రుద్రాధ్యాయం' అని పేరు. రుద్ర పదము 'రుదిర్-అశ్రువిమోచనే' అను మూల సంస్కృత ధాతువుతో నిర్మింపబడుతుంది. కావున రుద్రుడు అంటే 'ఏడిపించేవాడు' అని అర్థం. పాపులను దండించి (ఏడ్పించి) దారిలోనికి తెస్తాడు కనుక పరమేశ్వరునకు 'రుద్రుడు' అని పేరు. ఇది ఆధ్యాత్మికార్థం. ఇక ఆధిభౌతికార్థంలో రాజులు (ప్రభుత్వాలు) దుష్టులను శిక్షించి దారిలోకి తీసుకువస్తారు. కనుక వారిని (వాటిని) కూడా రుద్రులు అనవచ్చును. ఆదిదైవికార్థంలో ఏకాదశరుద్రులు చెప్పబడ్డారు. దశప్రాణాలు, జీవుడు కలిసి ఏకాదశ రుద్రులౌతారు. ఇవి శరీరాన్ని వదిలి వెళ్ళేటప్పుడు బంధువుల రోదిస్తారు. కనుక వీటికి రుద్రదేవతలని పేరు కలిగిందని బ్రాహ్మణ గ్రంథాలు వివరిస్తాయి.

యాస్కమహర్షి తన నిరుక్తశాస్త్రంలో రుద్ర పదమును మరికొంత వివరిస్తూ **"రుద్రో రౌతీతి సతః రోరుయమాణో ద్రవతీతి వా రోదయతేర్వా - నిరు. 10-1-6"** అని నిర్వచించాడు. అంటే, పెద్దగా శబ్దం చేసేది, ద్రవింపజేసేది, రోదింపజేసేది అని అర్థం. ఈ అర్థం విద్యుత్‌నకు అంటే మేఘాలలోని మెరుపునకు వర్తిస్తుంది. దట్టంగా మేఘాలు ఏర్పడేటప్పుడు మెరుపులు రావటం వెనువెంటనే ఉరుములు ఉరుమటం మనం చూస్తూ ఉంటాము. మెరుపులోని ఆ విద్యుత్‌యే మేఘాలను ద్రవింపజేసి వర్షాలను కురిపిస్తుంది. ఈ భావమే ఈ క్రింది వేద మంత్రంలో మనకు గోచరిస్తుంది -

**మీఢుష్టమ శివతమ శివో నః సుమనా భవ ।**
**పరమే వృక్ష ఆయుధం నిధాయ కృత్తిం వసాన ఆ చర**
**పినాక మ్బిభ్రదా గహి ॥ (యజుర్వేదము. 16-51)**

ఈ మంత్రదేవత రుద్రుడు. అంటే మంత్ర ప్రతిపాద్య విషయం రుద్రుని గురించినది. ఈ మంత్రంలో వర్ణింపబడిన రుద్రుడు విద్యుత్‌రూప రుద్రుడు. అట్టి రుద్రునకు మీఢుష్టమ, శివతమ, కృత్తిం వసానః, పినాకం బిభ్రవ అను విశేషణాలు జోడింపబడ్డాయి. అందులో మీడుష్టమ అంటే తడుపు వానిలో శ్రేష్ఠమైనది అని అర్థం. మేఘాలను వర్షింపజేసి భూమిని తడుపుతుందికనుక తడుపువానిలో యిదియే శ్రేష్ఠమైనది. ఇది మేఘాలలోని మరుపుయే అని తెలుయుటకు దీని పుట్టకను గూర్చి వేదశాస్త్రాలు ఏమి చెబుతున్నాయో పరిశీలింతము రండు.

ఈ విద్యుత్‌రూప రుద్రుడు గిరులలో ఉంటుందని ఈ రుద్రాధ్యయంలోని 2, 3, 4 మంత్రాలలో వర్ణింపబడింది. కాఠ సంహిత (36-14) లో

**'గిరిర్వై రుద్రస్య యోనిస్తత్ ఏషో ౨ భ్యవచరతి ॥ "**

అంటే రుద్రుని ఉత్పత్తి స్థానం గిరి. ఇచట గిరి అంటే పర్వతం అని కాదు. మేఘం అని అర్థం. నిఘంటువును పరిశీలిస్తే మేఘానికి గల 30 నామాలలో "గిరి" ఒకటి.

మేఘాలను సంరక్షించేది, వర్షింపజేసేది విద్యుత్‌రూప రుద్రుడేనని బ్రాహ్మణ గ్రంథాలు చెబుతాయి.

**పర్జన్యస్య పత్నీ విద్యుత్ । (తైత్తరీయ ఆరణ్యకం. 3-9-8)**

**విద్యుత్ అప్పు । (జైమనీయ బ్రాహ్మణము. 2-333.)**

అంటే మేఘం యొక్క పత్ని విద్యుత్. ఇచట పత్ని అంటే పాలించేది లేదా శక్తి స్వరూపిణి అని అర్థం.

అట్టి విద్యుత్ జలంలో ఉంటుంది. అదే వర్షాన్ని కురిపిస్తుంది.

ఈ వాక్యాలతో మనకు స్పష్టమైన దేమంటే పై మంత్రంలో వర్ణింపడిన శివుడు మేఘాలలోని విద్యుత్‌యే. దీనినే రుద్రుడు అని వేదం పేర్కొంటున్నది. ఈ విద్యుత్ రూప రుద్రుడే మేఘాలను వర్షింపజేసి భూమిపైనున్న ప్రాణులన్నిటిని ప్రసన్నులను చేస్తుంది. సుఖాల నిస్తుంది. ఈ కారణంచేతనే వేదం విద్యుత్తును శివతముడు అని కీర్తిస్తున్నది. అంటే మేలు చేయువారిలో ఉత్తమమైన వాడు.

మెరపులుగా కనబడే ఆ విద్యుత్ పెద్దగా ఉరుముతూ ప్రాణులను భయభీతులను చేస్తుంది. పిడుగులుగా ప్రాణులపై పడితే అవి రోదిస్తాయి. కనుక మెరుపురూప విద్యుత్‌నకు రుద్రుడు అనే పేరు వచ్చింది. ఈ విద్యుత్ రుద్రునే **'గిరిశ'** (యజు. 16-4) **'గిరిశన్త'** (యజు. 16-3) అను పేర్లతో వేదం పేర్కొంటుంది. మేఘాలకు పర్వతాలని మరొక పేరు.

(నిఘం. 1-10). మెరుపు (విద్యుత్) మేఘాలలో ఉంటుంది కనుక దానిని పార్వతి అని అంటారు. విద్యుత్ (మెరుపు) శక్తిరూపంలో ఉంటుంది కనుక దీనిని రుద్రపత్ని యని కూడా అంటారు.

ఈ విద్యుత్‌రూప రుద్రుని వాహనం వృషభ మని చెప్పబడింది. ఇట వృషభ మనగా మేఘమే. ఎందుకన, మేఘమే జలమును కురిపిస్తుంది. **'వృషభస్య - వర్షితుః అపామ్'** (నిరు. 7-6-22) అని నిరుక్త నిర్వచనం. ఇట్టి మేఘరూప వృషభముపై విద్యుత్‌రూప రుద్రుడు ఆసీనుడై విహరిస్తూ ఉంటాడు. మెరుపు రూప విద్యుత్‌కు అన్ని వైపులా ప్రకాశ కిరణాలు వెలువడుతూ కేశాలవలె (జటలవలె) ఉంటాయి. కేశాలే కిరణాలని నిరుక్తం (12-3-25) చెబుతుంది.

మెరుపునకు గల ఈ ప్రకాశకిరణాల వల్లనే రుద్రుడు జటాధారి యని పేర్కొనబడింది. అప్పుడప్పుడు ఆ విద్యుత్ (మెరుపు) భూమిపైకి దుముకుతుంది. దానినే మనం పిడుగు పడిందని చెబుతాము. అట్లు దుమికేటప్పుడు అతివేగంగా బాణంవలె వచ్చి భూమిని తాకుతుంది. అందుచే విద్యుత్‌రుద్రుని పినాకపాణి యని వేదం పేర్కొంది. రుద్రుడు తన విద్యుత్ రూపంతో అంతరిక్షంలో మేఘాల రూపంలో ఉన్న జలరాశిని పినాక = ఛేదించి వర్షింపజేస్తాడు. అందుచే శివునకు పినకపాణి యను విశేషణం చేర్చబడింది. విద్యుత్ రుద్రుడు అన్నిటిని భస్మం చేస్తాడు. కాన, శివుని భస్మధారిగా చెబుతారు. పుష్కలమైన జలరాశి రెండువిధాలుగా ఉంటుందని సుశ్రుత శాస్త్రం చెబుతుంది. **"తత్ పునర్ద్వివిధం గంగా సముద్రం చేతి "** (సుశ్రుతం సూత్రస్థానం. 47-7) అంటే జలరాశి భూమిపై సముద్రంగాను ఆకాశంలో గంగగాను ఉంది. కాన, అట్టి ఆకాశస్థ గంగను ధరించినవాడు శివుడు అని అర్థం

చేసుకోవాలి.

తాపసులు వస్త్ర ఆభూషణాలపై ఎక్కువ శ్రద్ధ చూపరు. మర్మావయవాలను మరుగుపరచుటకు, శీతోష్ణరక్షణకు మాత్రమే వస్త్రాలు ధరిస్తారు. అవి చిరిగినవైనా కుట్టుకొనిగాని, మడతలుపెట్టిగాని ధరిస్తూ ఉంటారు. ఆకాశంలోని మేఘాలను పరిశీలిస్తే అవి కొన్ని గుడ్డపీలికలు కలిసి ఏర్పడినట్లుగా ఉంటాయి. అటువంటి మేఘాలను విద్యుత్ రుద్రుడు ధరించి ఉంటాడుకాన అతనిని "కృత్తివాస" అని వేదం పేర్కొంటున్నది. చంద్రుడు మేఘాలపై ఉండి ప్రకాశిస్తూ ఉంటాడు. అందుచే శివుని చంద్రముకుటధారి యని చెబుతారు. శివుడు నాగులను (పాములను) ఆభూషణాలుగా ధరిస్తాడని వర్ణనలు కనబడతాయి. పామును సంస్కృతంలో 'అహిః" అంటారు. అహిః పదము కేవలము పాములకేగాక నీటికి కూడా వర్తిస్తుంది. నిఘంటువును పరిశీలిస్తే ఉదకానికి, మేఘానికి కూడా అహిః అనే పర్యాయపదాలున్నట్లు తెలుస్తుంది. విద్యుత్ జలాన్ని (మేఘాన్ని) ఆశ్రయించి ఉంటుంది. మరొకరకంగా విద్యుత్ రుద్రుడు అహులను (మేఘాలను) ఆభూషణాలుగా ధరించిఉంటాడని చెప్పవచ్చు. కావుననే కవులు శివుని 'నాగభూషణ' అని వర్ణిస్తూ ఉంటారు.

విద్యుత్ అంటే ఒక రకమైన అగ్నియే. ఈ అగ్ని భూలోకంలో సామాన్య అగ్నిగాను, భువర్లోకంలో విద్యుత్‌గాను, అంతరిక్షంలో ఆదిత్యునిగాను ఉంటుంది. అందుచేతనే విద్యుత్‌రుద్రునకు మహాదేవుడు అనే పేరు వచ్చింది. ఈ విద్యుత్‌రుద్రుడే మేఘాలను వర్షింపజేసి భూమిపై వృక్షజాతులను వికసింపజేస్తాడు. వాటివల్ల పశుపోషణ జరుగుతుంది. ఈ విధంగా రుద్రుడు పశుపతి - పశువులను పోషించే వాడయ్యాడు.

మేఘాలు తెల్లగా, బూడిదరంగుగా, నల్లగా, రకరకాల రంగులుగా మారుతూ ఉంటాయి. ఈ కారణంచేతనే శివుని 'శితికంఠుడు' అంటారు.

ఆకాశస్థ గంగను భూమిపైకి తీసుకువచ్చినట్లు చెప్పు కథలో సగరు డనగా అంతరిక్షం (సగర ఇతి అంతరిక్షనామ-నిఘంటువు 1-3). సగరుని పుత్రులు 60,000 మంది అని పురాణ కథనం. కాని సగర పుత్రులు 101 మాత్రమే అని కొందరు చెబుతారు. వారు ఎవరో కాదు నిఘంటువులో పేర్కొన్న 101 రకముల జలనామములే (విశేషణములే). (అర్ణః క్షధః.... ఇత్యేక శతమ్ ఉదక నామాని, నిఘం. 1-12). సగరుడు వదలిన యజ్ఞాశ్వం జల సామర్థ్యాన్ని సూచిస్తుంది. ఇంద్రు డనగా శ్రావణమాసంలోని సూర్యుడు. ద్వాదశాదిత్యులలో నాలుగవ వాడు. ఆ శ్రవణ సూర్యుడు అంతరిక్షంలోని జలాన్ని పృథివిపై వర్షంగా కురిపిస్తాడు. పృథివి పాతాళము. కపిలుడు సూర్యస్థ తారావిద్యుత్. వర్షాకాలానంతరం ఇది భూమిపై కురిసిన నీటిని మరల పీల్చివేస్తుంది. సగరుని మనుమడు అంశువు. ఇతడు ద్వాదశాదిత్యుల లోని మార్గశిరమాస సూర్యుడు. భగీరథుడు సగరుని మూడవతరం లోనివాడు. ఇతడు పుష్యమాస సూర్యుడు. ఈ సగరుని పుత్ర పౌత్రు లందరు కలిసి పృథివిపై పడిన నీటినంతటిని మరల ఆకాశానికి చేరుస్తారు. వాటిని ఫాల్గుణమాస సూర్యుని కిరణాలలో చేరుస్తారు. ఫాల్గుణమాస సూర్యుడే విష్ణువు. మరల ఆ విష్ణురూప సూర్యకిరణాలనుండి విద్యుత్‌రూప రుద్రుడు గంగను విడిపించి మేఘా లనే తన జటాజూటాలలో స్థాపించుకుంటాడు. ఇదే విష్ణు పాదాలనుండి గంగ వెలువడటం. దానిని శివుడు తన శిఖలలో ధరిస్తాడని విద్వాంసుల కథనం.

రుద్రుడు త్రినేత్రుడు. అంటే త్రిలోకాలలోని అగ్ని, విద్యుత్,

సూర్యులు. ఎందుకన, **అగ్నిరపి రుద్ర ఉచ్యతే** (నిరుక్తము 10-1-7) అని నిరుక్తం చెబుతుంది. అగ్ని జడ చేతన జగత్తునందంతట ప్రతిష్టమై ఉంటుంది. కనుక రుద్రుడు అర్ధనారీశ్వరుడుగా వర్ణింపబడ్డాడు. ఈ రుద్రుడే గ్రీష్మఋతువులో దక్షిణసూర్యునియొక్క ఉష్ణతారూప పుత్రుని వైశాఖ జేష్ఠ మసాలలో పొందుతాడు. శ్రావణమాసంలో వర్షం ద్వారా ఉష్ణతను సమాప్తం చేస్తాడు. దీనినే దక్షయజ్ఞ విధ్వంసంగా వర్ణిస్తారు. ఎందుచేతనంటే, ఆదిత్యునే దక్ష (ఆదిత్యో దక్ష ఇత్యాహుః, నిరు. 11-2-20) అని నిరుక్తం చెబుతుంది. ఈ రుద్రుడే శ్రావణమాసంలో వజ్రరూపం ధరించి మేఘాలలో ఘర్జించుచు పరుగుడితూ ఉంటాడు. అప్పుడు ఆ మెరుపు హస్త ముఖాది రహితమైన వంకరలు తిరిగిన వజ్రఖడ్గంగా ఆకాశంలో గోచరిస్తుంది. ఇదే రుద్రశివుని విశాల విశుద్ధ స్వరూపం. ఇట్టి రుద్రునికి పౌరాణికులు ఒక ఆకారాని కల్పించి విగ్రహాలను తయారుచేసారు. పూజావిధానాలను నిర్మించారు. వ్రత నియాలను ఏర్పరచారు. అమాయకులను ఆధ్యాత్మిక అంధకారంలో పడవేసారు. శివుని విశుద్ధ విశాల స్వరూపం తెలిసికొనుటకే మూలశంకరుడు **(మహర్షి దయానంద సరస్వతి)** తన 14వ ఏట సత్యగురువుల వెదుక యిల్లు వదలి దేశసంచారం చేసాడు. తిరిగి తిరిగి చివరకు సత్యగురువైన ప్రజ్ఞాచక్షువు విరజానందుని అంతేవాసి అయ్యాడు. ప్రాచీన ఋషి పరంపర ననుసరించి వేదవేదాంగాల నధ్యయనం చేసాడు. శివుని విశుద్ధ స్వరూపాన్ని చక్కగా తెలిసికొన్నాడు. శివ పదం యౌగిక మనియు, దీని మూలార్థం (శివు-కల్యాణే) అందరికి మేలుచేయు వాడనియు గ్రహించాడు.

ప్రకరణాన్నిబట్టి (ప్రసంగాన్నిబట్టి) శివులు వేరువేరుగా ఉంటారని

అవగతం చేసుకొన్నాడు. ఆ సత్యవిద్యను ప్రచారం చేయుటకే తన జీవితాన్ని అంకితం చేసాడు. అమర 'సత్యార్థ ప్రకాశం' మన కందించాడు.

సత్యార్థప్రకాశపు వెలుగులో చూస్తే అధ్యాత్మికార్థంలో (ఉపాసనా ప్రకరణంలో) శివుడు సర్వవ్యాపకుడై సర్వప్రాణులకు మేలేచేసే పరమేశ్వరు డని అర్థం అవుతుంది. ఆధి భౌతికార్థంలో ప్రజలందరకు మేలుచేసే ధర్మాత్ముడైన రాజుకు, సంతానానికి మేలుచేసే మాతా పితరులకు, ఆప్తులు మొదలైన వారికి ఇది వర్తిస్తుంది. ఇక దైవికార్థంలో చూస్తే మనకు మేలుచేసే భౌతిక పదార్థలకు, ప్రాకృతిక శక్తులకు శివపదం వర్తిస్తుంది. వర్ష ప్రకరణంలో ఈ పదం ప్రాకృతిక శక్తియైన రుద్రవిద్యుత్‌నకు (మేఘాలలో ఏర్పడే మెరుపులకు) వర్తిస్తుంది. అద్భుతాద్భుతమైన ఈ సృష్టిలో ఇట్టి ప్రాకృతిక శక్తులనన్నిటిని సృజించినది పరమశివుడు పరమేశ్వరుడే. ఈ ప్రాకృతిక శివులను, రుద్రులను గతిశీలముచేసేవాడును ఆతడే. అట్టి పరమశివుడు సర్వవ్యాపకుడనియు, సర్వాంతర్యామి యనియు వేదం చెబుతుంది.

**శివస్త్వష్టరిహా గహి విభు పోష ఉత త్మనా ।**
**యజ్ఞే యజ్ఞే న ఉదవ॥ (ఋ. 5-5-9)**

సర్వులకు మేలుచేసే పరమ శివుడు (త్వష్టః) ఈ అద్భుతాద్భుత సృష్టికి నిర్మాత (డిజైనర్). (విభుః) సర్వవ్యాపకుడు. (పోష) సర్వమును పోషించేవాడు. అతడు (నః) మా యొక్క (యజ్ఞే యజ్ఞే) ప్రతి యజ్ఞ కర్మయందు అనగా ఫలకాంక్షారహిత పరోపకార కర్మ లన్నిటియందు ప్రవేశించి మాకు మేలు చేయును గాక !

అట్టి సర్వవ్యాపక పరమ శివుని ప్రాప్తించి పరమశాంతిని బొందుడని శ్వేతాశ్వతరోపనిషత్ ఉపదేశిస్తుంది.

**సూక్ష్మాతి సూక్ష్మం కలిలస్య మధ్యే**
**విశ్వస్య స్రష్టార మనేకరూపం ।**
**విశ్వస్యైకం పరివేష్టి తారం**
**జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి ॥**

**(శ్వేత. ఉ. 4-14)**

ప్రకృతికంటెను, జీవులకంటెను పరమేశ్వరుడు అత్యంత సూక్ష్ముడు. అగాధమగు ఈ అనంత విశ్వమధ్యమున ఉండి అనేక రూపాలతోకూడిన ఈ విశ్వాన్ని సృష్టిస్తూ అంతట వ్యాపించి ఉంటాడు. అతడు ఒక్కడే. అట్టి శివుని (శుభంకరుని) తెలిసికొనియే (అంటే అతనిని సాక్షత్కారం చేసికొనియే) జీవుడు పరమ శాంతిని పొందుతాడు.

**న తస్య కశ్చిత్ పతి రస్తి లోకే**
**న చేశితా నైవ చ తస్యలింగమ్ ।**
**స కారణం కరణాధిపాధిపో**
**న చాస్య కశ్చిత్ జనితా న చాదిప : ॥ (శ్వేత. ఉ. 6-9)**

ఆ పరమశివుని రక్షించేవాడు, పాలించేవాడు మరియొకడు లేడు. అతనిని గుర్తించటానికి భౌతిక చిహ్నాలు ఏమీలేవు. అతడు జగత్తునుకు నిమిత్తకారణం. ఇంద్రియాది కరణములకు అధిపతియైన జీవునకును అతడు స్వామియే. అతనని జనింపచేసేవాడు మరియొకడు లేడు. అతడే సర్వజనకుడు, సర్వస్వామియునై యున్నాడు.

పై ఉపనిషత్ వాక్యాలవలన స్పష్టమైన దేమంటే పరమేశ్వరుడు నిరాకారుడు. అతనికి ఒక మూర్తిని (ఆకారాన్ని) కల్పించటం నిరర్థకం.

భాగవత పురాణంకూడా మూర్తిపూజ నిరర్థకమనియే చెబుతుంది.

**యో మాం సర్వేషు భూతేషు సన్త మాత్మాన మీశ్వరమ్ ।**
**హిత్వార్చాం భజతే మౌఢ్యా భస్మన్యేవ జుహోతి సః ॥**

**(భాగవతం. 3-29-22)**

ఎవడు సర్వవ్యాపకుడను సర్వభూతాత్మంతరాత్మను యైన నన్ను ఉపాసించుట విడిచిపెట్టి మూర్ఖతతో మూర్తిని నిర్మించి పూజించునో అతని ఆ పూజ బూడిదలో ఆహుతులిచ్చేనట్లే యగును.

జ్వలించు అగ్నిలో ఆహుతులిచ్చిన అవి అణువులుగా మారి గాలిలో కలిసి బహుళ ప్రయోజనకర మౌతాయి. అవే ఆహుతులు అగ్నిపూర్తిగా చల్లారి భస్మమైన పిమ్మట అందువేస్తే అవి ఎవ్వరికిని ఉపయోగపడక వ్యర్థం అవుతాయి. అట్లే మనలో అంతర్యామిగా నున్న పరమాత్మను ఉపాసించుట విడచి మూర్తులను పూజిస్తే అది నిరర్థకమే అవుతుంది. దేవీభాగవతం మూర్తులకల్పన ధూర్తులచే చేయబడిందని నిందిస్తుంది.

**ప్రాప్తే కాలావహహా దుష్టతరే చ కాలే**
**న త్వం భజన్తి మనుజా నను వఞ్చితాస్తే ।**
**ధూర్తైః పురాణచతురైర్హరి శంకరాణామ్**
**సేవా పరాశ్చ విహితాస్తవ నిర్మితానామ్ ॥**

**(దేవీ భాగవతం. 5-19-12)**

ఓ దేవీ మాతా ! దుష్టతరమైన కలియుగం వచ్చినపుడు మానవులు నీ అసలైన భజనను (ఉపాసనను) విడిచి పెట్టుదురు. అంతేగాక, దానికి విపరీతంగా పురాణాలను కల్పించి వ్రాయుటలో చతురులు

మరియు ధూర్తులు నైనవారు నిర్మించిన బ్రహ్మ విష్ణు శివుల విగ్రహాలను పూజించి వ్యర్థమైన వ్యయ ప్రయాసలకు గురిఅవుతారు.

పై దేవీభాగవత వచనాలవల్ల పరమేశ్వర ప్రాప్తికి మూర్తి పూజ ఏ విధంగాను ఉపయోగపడదని స్పష్టమౌతున్నది. పరమేశ్వర ప్రాప్తికి ఉపాసన యొక్కటియే మార్గమని తెలుస్తున్నది.

ఆ పరమ శివుని ఉపాసన ఏదో ఒక రాత్రి చేస్తే సరిపోదు. ప్రతి రాత్రి నియమంగా దీర్ఘకాలం చేయాలని వేదం సూచిస్తుంది.

**శివాం రాత్రీ మనుసూర్యం చ**
**హిమస్య మాతా సుహవా నో అస్తు ।**
**అస్య స్తోమస్య సుభగే నిని బోధ**
**యేన త్వా వన్దే విశ్వాసు దిక్షు ॥**

**(అథర్వవేదము. 19-49-5)**

సూర్యాస్తమయానంతరం వచ్చు ప్రతి రాత్రి సుఖశాంతుల నిచ్చునదియే. పరమాత్ముని ఉపాసనకు రాత్రియే అనుకూలంగా ఉంటుంది. ప్రాచీన ఋషులు, మునులు, యోగులు రాత్రులందే ఉపాసన చేసి పరమశాంతిని పొందారు. అతడే సర్వదిశలలో వ్యాపకుడై స్తవనీయుడుగా, వందనీయుడుగా ఉన్నాడు.

పై వేదమంత్రంలోని గంభీర తాత్త్విక రహస్యాన్ని అవగతం చేసుకున్న మహర్షి దయానందుడు ప్రతి రాత్రి సర్వవ్యాపక సరేశ్వరుని ఉపాసించి సఫలతను పొందాడు. తాను పొందిన సఫలతను పొందుటకు అందరిని ప్రేరేపించాడు. యజుర్వేదానికి ప్రామాణిక భాష్యం వ్రాస్తూ ప్రకరణాన్ని అనసరించి రుద్రాధ్యాయానికి ఆదిభౌతికార్థం వ్రాసాడు. ప్రాచీన ధనుర్వేదాన్ని పునరుద్ధరించి మన దేశాన్ని శస్త్రాస్త్రసంపన్నం

చేసుకోవాలని ప్రేరేపించాడు. వేదాలకు ఆదిదైవికార్థాలను అన్వేషించి నపుడే విజ్ఞానం వికసించగలదని బోధించాడు. అందుకు మార్గం చూపించాడు. నేటి విద్యుత్ సమస్యకు రుద్రవిద్యుత్ (మెరుపులనుండి విద్యుత్) సమీకరించ వీలగునేమో విజ్ఞానవేత్తలు ఆలోచించవలసి ఉంది. అస్తు.

వేదాలలో విద్యుత్‌ను గురించి వివరించే మంత్రాలు అనేకం ఉన్నాయి. వాటిలో ఆకాశీయ విద్యుత్‌ను "ఊర్వశి" అని పేర్కొనటం కనబడుతుంది. అట్టి ఊర్వశి దీర్ఘాయువును ప్రసాదించునని చెప్పబడింది.

**విద్యున్న యా పతన్తీ దవిద్యోద్భరన్తీ మే అప్యా కామ్యాని ।**
**జనిష్టో అపో నర్యః సుజాతః ప్రోర్వశీ తిరత దీర్ఘమాయుః ॥**
**(ఋగ్వేదం. 10-95-10)**

ఆకాశంలోని మేఘాలలో సంచరించే ఊర్వశీనామక విద్యుత్ మేఘాలను చక్కగా వర్షింపజేసి సంపదలను పెంచుతుంది. మానవులకు మేలుచేయు వర్షాలను కురిపిస్తుంది. ప్రాణవాయువును ప్రభావితంచేసి దీర్ఘాయువును ప్రసాదిస్తుంది.

ముఖ్యంగా గంగాధర శివునకు (మెరుపు విద్యుత్‌నకు) వర్షాలకు ఏదో దగ్గర సంబంధం ఉంది. ఆ రహస్యాన్ని కనుగొంటే సమయానుకూల వర్షాలు కురిపించి పృథివిని సస్యశ్యామలం చేవచ్చు. అప్పుడు గంగాధర శివుడు లోకకళ్యాణ కారకుడౌతాడు.

శమ్ ఇతి ఓ3మ్

# గాయత్రీ ఆశ్రమట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40=00), వేదాలలో జలచికిత్స (20=00), వైదిక క్రాంతి పథం (15=00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము(15=00), చౌహ్వాదిని (ఋషుల దృష్టిలో గర్భచికిత్స) (15=00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (15=00), వైదిక వైజ్ఞానిక సంస్కృతి (10=00) మానవ ధర్మము (10=00), అశ్వినీ దేవతలు (20=00), సంధ్యావందనము - వైజ్ఞానిక సమాలోచనము (20=00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30=00), గంగాధర శివుడు (5=00), గోమాత (7=00), గాయత్రీ మహిమ (6=00), జననీ - జన్మభూమి (5=00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షిదయానందుడు (4=00), దైనిక అగ్నిహోత్ర విధి(4=00), పురుషోత్తముడు శ్రీరాముడు (14=00), వేదములలో విజ్ఞాన బీజాలు, (10=00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00), వైదిక వివాహ వైశిష్ట్యము (8=00), చతుర్దశ భువనములు(3=00), ధర్మవీర్ పం. లేఖరాం (3=00), మహర్షి మనువుపై విరోధమెందుకు (3=00), ప్రణవ స్తోత్రమ్ (3=00), వేదాలలో అప్సరస గంధర్వులు (3=00), యజ్ఞోపవీత వైశిష్ట్యము ( 2 = 0 0 ), లక్ష్మీసూక్తము (2=00), శాంతి ప్రార్థన (2=00), ద గ్రేట్ గాయత్రీ (2=00), వైదిక అర్థనీతి (2=00), చాణక్యనీతి(40=00), అక్కా-చెల్లెండ్ల ధార్మిక చర్చ (20=00), బ్రహ్మచర్య విజ్ఞానము(15=00), శ్రీ దయానంద హృదయము (12=00), స్వరాజ్య సంగ్రామములో ఆర్యసమాజము (8=00), సత్య ధర్మ విచారణ (6=00)



Gayatri Series : 39
**GANGADHARA SHIVUDU** Rs. **5=00**




"One should always be ready to accept truth and give up untruth"



**- Maharshi Dayananda Saraswati**

*Published by :*

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Vyas Samajam, Medi Bavi,
Seetapalmandi, Secunderabad - 500 061.